గోలకొండపత్రిక

చిత్రభాను సం॥ర నిజ జ్యేష్ఠ శు॥ ౨ సోమవారము

# ఆంగ్ల హిందూస్థానీ సమస్య

౧౭౫ ఏండ్లనుండి ఇంగ్లీషువారు హిందూస్థానమును వశపరచుకొని పరిపాలించుచున్నారు. పరిపాలకులకు అధీన దేశమువలన వీలైనంతలాభమును కలకాలము పొందుచుండవలెనను కోరిక యుండుట సహజమైన విషయము. మరి పరిపాలితులు స్వతంత్రులు కావలెనని కోరుటయు ప్రకృతిధర్మము. ఈసంఘర్షణలో పరస్పరమనస్పర్ధలు, పరస్పర విశ్వాసరాహిత్యము, పోరాటములుజరుగుచుండుటకూడా నైసర్గికమే. ౧౮౫౭ విప్లవమునాటినుండియు హిందూస్థానము స్వాతంత్ర్యము గోరుచున్నది. కాంగ్రెసు ఉద్యమముతో అదికొత్తరూపము దాల్చెను. గాంధీగారు రాజకీయరంగములో ప్రవేశించుటకు పంజాబు దురంతాలు ముఖ్యకారణమయ్యెను. వారిరాకతో దేశమంతయు స్తబ్ధత్వమును విదలించుకొని సంపూర్ణముగా కదలిపోయెను. కాని ఇంగ్లీషువారిరాజనీతిముందు హిందూస్థానీల రాజనీతి యెందుకును పనికిరాకపోయెనే. ఇంగ్లీషువారు భారతీయుల ఆందోళనములను లెక్కపెట్టునట్లే కనిపించురు కాని లెక్కపెట్టరని తుదిమారు క్రిప్సురాయబారముతో తేలిపోయింది.

హిందూస్థానమిప్పుడు పెద్దయిరుకులోనే తగులుకొన్నది. ఒకప్రక్క మన ఆంధ్రమహాసభలోని కామ్రేడుపార్టీవారు భావించినట్లుగా "ఫాసిస్టుతత్వము" విజృంభించింది. నాజీతత్వము ముంచుకొనివచ్చుచున్నది. "సామ్రాజ్యమణతత్వము" నగ్నతాండవమాడుచున్నది. ఫాసిస్టుతత్త్వానికి ప్రక్కతాళంవేసే జపానుభీభత్సము హిందూస్థానముపై ఆవరించుకొంటున్నది. బ్రిటిషువారేమో ఇప్పుడు హిందూస్థానీలకేమిన్నీ ఇచ్చేది కానకాదు. యుద్ధానంతరంమెచ్చుకొ నేరీతిగా స్వాతంత్ర్యలక్షణమును ప్రసాదించుతామన్నారు. అది "వందోరాజాభవిష్యతి" అనుకథగానున్నది. ముందుమాటమాకు మనసుకురాదు. ఇప్పటిముచ్చటయేమి? అని కాంగ్రెసువారు ముష్కరించుకొని కూర్చునిరి. అటయితే మీకు మాకు రాజీకుదురదని మూటముల్లె కట్టుకొని క్రిప్సుగారు ఆగ్రహోదగ్రులై వెళ్ళిపోయిరి- అచ్చట పార్లమెంటునుండి సర్-క్రిప్పుగారున్నూ అమెరీ ఇండియామంత్రిగారున్నూ మరికొందరు ప్రముఖులున్నూ తమ ధార్మికశీలమును గురించిప్రకటించుకొనుచున్నారు-

"ప్రపంచజనులారా! ముఖ్యముగా అమెరికాజనులారా! చూచినారా మా ఉదారదేశము- హిందూస్థానీలకు తెలివిలేకుంటే నిరాకరించినారుకదా. మేము ఎంతటి ఔదార్యముతో ఎంతటి సద్భావములతో, ఎంతేటి త్యాగముతో హిందుస్థానీలకు యుద్ధానంతరము వివిధవరములను ప్రసాదింప వాగ్దానముచేసితిమో? ఇకమాపైన తప్పుమోపగలవారెవరునూ ఉండగూడదు" అనేఘోరలేని వారుస్పష్టపరచినారు- కొన్ని ఆంగ్లవార్తాపత్రికలున్నూ కొందరుపార్లమెంటు సభ్యులున్నూ మరల రాయబారాలంపు జరుపండీ, హిందూస్థానీలను తృప్తిపరచండి" అని ప్రచారంచేసినారు. అమెరీగారు వీలులేదన్నారు.

ఇక హిందూస్థానీ నాయకులను చూడండి. గాంధీగారి దొక్కనిదొకత్రోవ. నెహ్రూగారు అటుజపాను జర్మనీలను చెడతిట్టుతారు. అదేరధోణిలో పాపం ఇంగ్లీషుసామ్రాజ్య తత్త్వాన్ని కూడ చెరిగిపోస్తారు- రాజేంద్రబాబు దదేపద్ధతే- కానివారు జపానునేఎక్కువగా తిట్టిపోస్తున్నారు- ఇక సీ. రాజగోపాలచారిగారు అటుఅరచి యిటుఅరచి, అటుదుమికి ఇటుదుమికితుదకు హిందూస్థానానికి సకలరోగసంజీవని ఒక పాకిస్థానే! అన్యధాశరణంనాస్తి!! అని ఒకేధోరణిలో దినమున్నూ అదేపనిగా ప్రచండమగుప్రచారముచేయుచున్నారు- కాని వారికి తమిళనాడులోనే ఏమైనాకొంత వినేదిక్కుందేమో-అక్కడకూడా వారికి నాజూకుగా రాళ్లసందేశమునుసభలలో పంపినారు. మలబారువారు "శ్రీమాన్ గారూ! మాసీమకు తామువచ్చే శ్రమవహింపవలదు" అని ముందుగానే వారికి మనవిచేసుకొన్నారు- మరిఆంధ్ర రాష్ట్రము శ్రీమాన్ చక్రవర్తులవారి తిరుమంత్రోపదేశమును పాకిస్థాన తప్తచక్రాంకణమును స్వీకరించుటకు ఏమాత్రమున్నూ సిద్ధపడకపోయెను- మౌలానా ఆజాదుగారే వారికిముఖ్య ప్రతికూలురైనారు- ఇదికాంగ్రెసుధోరణి-

ఇక హిందూమహాసభ ఒకదిక్కు ఆందోళనం చేయుచున్నది- వారికిని స్వరాజ్యముకావలెకాని పాకిస్థానంటేవారికిఒళ్లంతా మంటలెత్తుతుంది- యుద్ధములో హిందువులంతా బాగాచేరండీ అని వారంటారు- మరియు ముస్లింలీగువారు మాపాకిస్థాన్ మాకిస్తేనేసరి లేకుంటే మేము ముష్కరించుకొనియే యుంటాముఅని పట్టుబట్టినారు- వారికి తలవనితలంపుగా శ్రీమాన్ రాజాజీగారుప్రధానప్రచారకులుగా లభించినారు- ఇదివారి మొదటివిజయము- కాని ముస్లింలీగు యుద్ధసహాయంవిషయములో మాత్రము పలుకకుండాఉన్నది- ఇన్నియిట్లుండగా దేశీసంస్థానాలవారి సమస్యవంటి గడ్డు సమస్య ఇంకొకటిలేదు- పాపము దేశీప్రభువులు ఎటువంటివారైనా వారయు ద్ధానికిమాత్రము ఉత్కృష్టముగా సహాయపడుచున్నారను విషయము ఒప్పుకోవలెను- దేశీప్రభువులు కోట్లకొలదిగా చందాలిచ్చినారు- కోట్లకొలదిగావడ్డీలేని అప్పులిచ్చినారు- వేలకొలదిగా సైన్యాలనంపినారు- యుద్ధసహాయంలో వారిదేమిన్నీలోపంలేదు- అయితే ఈయుద్ధసహాయంలో దేశీసంస్థానప్రజలదే ముఖ్యభాగమనిగమనించవలెను- ద్రవ్యమంతయు దేశీసంస్థానప్రజల ద్రవ్యమే! సైన్యాలంతయు సంస్థాన ప్రజలలోనుండియే సర్పడినట్టివి- దేశీప్రజలు ఒకమాటకూడా నేటివరకు యుద్ధప్రతికూలంగా మాట్లాడలేదు- యుద్ధమువిషయములో ప్రభువులకును ప్రజలకును ఏమిన్నీ అభిప్రాయభేదము లేదన్నమాట- ఇకఏమైనా వివాదముండిన అదిపరిపాలనపద్ధతిలోనే యున్నది- సంస్థానప్రజలు ప్రజాప్రతినిధి శాసనసభలను కోరుచున్నారు- బాధ్యతాయుతప్రభుత్వమును కోరుచున్నారు- ప్రజలకును ప్రభుత్వములో మంచిస్థానముండవలెనని ఆందోళనము చేయుచున్నారు- కాని ప్రభువులు ఇందుకు సుముఖులుగా కానరాలేదు- అయితే యీమధ్యన రెండువిచిత్రాలు సంభవించినవి- కాశ్మీరుమహారాజాగారు సర్-క్రిప్పుగారు వచ్చినకాలములో ప్రకటించినసందేశము దేశీసంస్థానాలచరిత్రలో చారిత్రికప్రాముఖ్యతవహించినదయ్యెను- ఇప్పుడు ఇందూరుమహారాజాగారు తమ అభిప్రాయములను ప్రకటించినారు- వారు ౨౧ మేనాడు అమెరికాసంయుక్తరాష్ట్రాల సభాపతిగారగు రూజువెల్టుగారికి వ్రాసినలేఖను మేమిదివరకేప్రకటించినాము- దానిలోని భావాలుచాలా ఉత్తమముగాఉన్నవి- వారు కేవలము తమనుగురించి ఆలోచించలేదు- వారు దేశీసంస్థానాలనుగురించికూడా విచారపడలేదు- వారు మొత్తముహిందూస్థానమునుగురించి ఆందోళనపడినారు- అమెరికా, చీనా, రష్యా దేశాలుకలిసి హిందూస్థానమునకు ఇంగ్లాండునకు గలవిభేదాలను పరిష్కరించవలెనని సూచించినారు- మనదేశములో కామ్రేడులు, కమ్యూనిష్టులు కొందరున్నారు- వారు రష్యాతో సానుభూతిని బాహాటముగా ప్రకటించుచుందురు కాని రష్యామాత్రముయుద్ధారంభమునుండి హిందుస్థానమునుగూర్చి ఒక్కముచ్చటకూడాచెప్పలేదనువిషయమును మనకాంమ్రేడుమిత్రమండలివారు గమనింతురుగాక- విదేశాలు మనసమస్యను పరిష్కరించుటకల్ల- మనకును బ్రిటిషువారికిని ఎన్నడైనను సమరసముగా పరిష్కారముకావలెనేకాని ఇతరులువచ్చి ఉద్ధరింతురని కలలుకనుటవలన పేలపిండి బ్రాహ్మణవటువు కలలుకనినట్లే విచారపడుదురు- ఇట్లుండినను ఇందూరుమహారాజాగారు చాలాదూరముపోయి చాలాపెద్దముచ్చట్లువెల్లడించినారు- కాని తమరాజ్యములో తమప్రజలకు బాధ్యతాయుతప్రభుత్వాన్ని ఎందుకియ్యకపోయెను? అపెద్ద ప్రశ్న ఆయనను ఎదిరించుచున్నది- మొత్తానికి మనదేశమిప్పుడు గందరగోళములోపడి అవస్థపడుచున్నదనుట సువ్యక్తముగా కనబడుచున్నది.

## రేవావిచారణనుగూర్చి

### సావర్కరుగారి ప్రకటన

అఖిలభారత హిందూమహాసభాధ్యక్షులగు సావర్కరుగారు రేవామహారాజునుగూర్చి విచారణచేయుటకు శైస్రాయిగారుచేసినఏర్పాటువిషయమై యీక్రిందిప్రకటనను చేసినారు-

"విచారణసంఘమువారు శ్రద్ధగాజేయించవలసినముఖ్యవిషయము శైస్రాయిగారు సంధికాల్లాలోకాను ఏసంస్థానాధీశుని గాని సింహాసనముమండిత్రోలగించునంత తీవ్రచర్యను గైకొనుటకు అధికారమునిచ్చినట్లు విడిగాచెప్పబడకున్నను ఆసంధిహక్కులకువిరుద్ధముగా అట్టిచర్యను ఎట్టిహద్దు మేరలలోబడి గైకొనుట న్యాయ్యమనువిషయమున అన్నిసంస్థానముల గౌరవము, స్థయిర్యము న్యాయ్యమనైనఅవసరములు అనువాటిని ఎంతదూరముపాటించవలెనను సామాన్యసూత్రమైయుండును. అహద్దులసంధిహక్కుల సత్యత్వమును, సార్థకత్వమును ఏవిధమునగాని భంగపరచనట్లుండవలెను" రేవాసంస్థానప్రజలు అనేకులకొలదిమందిసంతకములుచేసిన విజ్ఞప్తులనుపంపించియు, రాయబారులద్వారా తెలిపియు సంస్థానమంతటను బహిరంగసభలనుజరిపించియుతాము మహారాజుగారియందు అచంచలభక్తిగలిగియున్నామనియు వెంటనేవారిని పూర్ణాధికారములనువారికిన్వ్యవలెనని కోరుచున్నామనియు విశదముచేసియున్నారని సావర్కరుగారు ప్రకటనలోచెప్పినారు. ఇప్పుడువిచారణ పూర్తిచేసి విచారణసంఘమువారు ఒకనిర్ణయమునకు వచ్చువరకు రేవాసంస్థానములోప్రజలు ఆందోళనను ఆపియుండవలెనని సావర్కరుగారుకోరినారు-

విచారణసంఘమువారు నిర్ణయముచేయుటకు అనవసరముగ కాలయాపన చేయుచున్నచో ప్రభుత్వమువారు ఇప్పుడుఆరెస్టులోనున్న ప్రజానాయకులను, కార్యకర్తలను వదలిపెట్టవలెనని సూచించినారు-

## స్థానికవార్తలు

హైద్రాబాదు యుద్ధనిధికి యింతవరకు ౬౮౯౦౧౦౧౫౫౨ రూపాయల ౧౬౫౦౧౨౭౫లల్లారులు వసూలైనవి-మరియు ౧౫౭ లక్షలరూపాయల విలువగల వస్తువులున్నూ ౧౭౬౬౨ కల్లారులున్నూ తెనాలయ్యెను-ఈమొత్తములు బీదరు,నాందేడు,గోల్కొండ తాలూకాలనుండి మొగల్పురా నాంపల్లి దారులులాంకాచీగూడా బాలికలబడి మరియుతేరలభ్యనుండి తహసీళ్లనుండి యితరాధికారులద్వారా వసూలైవి-

... ...

శుక్రవారమునాడు గౌ॥ రాజా ధర్మకరణ్ మంత్రిగారిఅధ్యక్షతలో మ-ఘ-వ-నిజాంగారికి సుల్తానల్ హిఅదా బిరుదములభించినందులకు అభినందించుటకై హైద్రాబాదునగరములో సభజరిగెను-అందు అధ్యక్షులు మ-ఘ-వ- వారి విద్యాపాండిత్యము వారి సైపీపాటవము వారిశక్తిసామర్థ్యాలు బహువిధాల కొనియాడిరి-

... ...

మ-ఘ-వ-నిజాంగారు ఒక స్థానికపత్రికలో ఫార్సీలో ఈక్రిందివిధముగా వ్రాసినారు-

"సోమాజిగూడలోని-ఫఖ్రుల్ ముల్క్ గోరి కలదు- దానినిమంచిస్థితిలోనుంచవలెనని మేము అవసరమగుసూచనలు ట్రస్టీలువారికి చేసినాము- మేముఅప్పుడప్పుడు పాతిహాదదివించుట కిక్కడికిపోవుచుందుము, మరియుఇదిరాష్ట్రములోని గోరీలలోముఖ్యమైనది. ఇతడుమా పెద్దలయెడ మంచిరాజభక్తికలిగి యుండినవాడు- మనిషికి రెండుస్థలాలున్నవి- ఒకటిభూమిపైన ఇంకొకభూమిలోపల ఇతడు తనగుణాలచేత జ్ఞాపకముందదగినవాడు-

... ...

హైద్రాబాదుపశువైద్యాధ్యక్షులగు బాలకృష్ణ నాదమీగారికి రావుబహద్దురుబిరుదమును సికింద్రాబాదుకలెక్టరగు కే.ఆర్-అయ్యంగారు గారికి రావుసాహెబ్ బిరుదమున్నూ బ్రిటిషుప్రభుత్వము వారిచే లభించినవి-

... ...

దేశాయిగారు వరంగల్ జెయిలులో చనిపోయినను వార్తపై డాక్టరు అతిఫుసంయారుగారు తమవిచారమును తెలిబుచ్చిరి ఖైదుగులు రాకముందే శవదహనంచేయుటయేల? ఈవిషయంలో ప్రభుత్వమువారు విచారణచేయించి విషయములబయటపెట్టగలరని అభిప్రాయమిచ్చిరి.

... ...

జూ-౧౫ తేదీ శుక్రవారం సాయంత్రం ౫-గంటలకు సుల్తానుబజారులోని శ్రీకృ.దే.రా.గ్రంథాలయములోజాషువాగారు కావ్యగానముచేసిరి- సభకు ఆంధ్రభాషాభిమానులు,భాషాపోషకులు,వ్యయముగాలపులనుఆయన శ్రీ.శ్రీ.డా.పి.వి. రమణయ్యగారు అధ్యక్షులుగానుండిసభాకార్యకలాపమును నిర్విఘ్నముగనడిపించిరి-

కావ్యగానమునకుముందు జాషువా గారినిగూర్చిఅధ్యక్షులు ఈవిధముగాచెలవిచ్చిరి.

"జాషువాకవిగారు లెక్కకువచ్చువలెనట్లాటపాకవులు కారు- వారుఒకరికడ నేర్చుకొనని సహజకవితాధురంధరులు- వారికవిత్వముఅల్లాటప్పాకవిత్వముకాదు వారు సంస్కృతములోకూడకావ్యనాటకాలంకారసాహిత్యమును గడించినవారు"అనిచెప్పుచుకవిగారిని కావ్యగానమునకాహ్వానించిరి-

జాషువాగారు తామురచించినఅనేక ఖండకావ్యములనహృద్యమగునముగాపాడిసభ్యులనానందపరచిరి-అధ్యక్షులు సెలవిచ్చినదానికిసిద్ధమునగా జాషువాగారు కావ్యగానమధ్యమున ప్రాస్తావికముగా తెలుసుందేశమున్నగు సంస్కృతకావ్యములలోని కొన్ని శ్లోకములను చదివి తమసహజపాండిత్యమును ఎందరికికెల్ల కపరచిరి- వారి శ్లోకపఠనపద్ధతికసభ్యులు విస్తుబోయిరి- ౧గంటలకుసభముగిసెను-

... ...

హిందుప్రజామండలిపక్షాన కేసర్కరుగారు ప్రభుత్వమువారికొక విజ్ఞప్తి పంపినారు, మండలివారుముద్రించిన కొన్నిపత్రాలు ప్రభుత్వమువారు జప్తిచేసినారు. వాటినివాపసుచేయవలెనని కోరినారు-గోపాలరావు బూర్గులగారు హైద్రాబాదుజెయిళ్ళలో నుంచబడిన రాజకీయఖైదీలకు బ్రిటిషుఇండియాలో రాజకీయఖైదీలకు వర్తించువిధానమును అవలంబించవలెనని కోరియున్నారు-

... ...

అఫ్సర్ యార్జంగుబహద్దరు అనువారి కూతురి పెండ్లిజరిగింది. ఆపెండ్లిసందర్భములో మ-ఘ-వ వారువ్యయముగా సైఫాబాదులోపెండ్లియింటికి వెంచేసి ౧గంటసేపుండి వెళ్లిపోయినారు.

... ...

జౌరాదుషాజహాన్‌లో హిందూముస్లిం యుద్ధములోజరిగినఘోరాలను విచారించుటకు న్యాయాధిపతుల కొరిసంఘమువారు చందులాలుగారిని పంపియుండిరి-వారక్కడికెళ్లి విచారణను పూర్తిచేసుకొని హైద్రాబాదునకుతిరిగివచ్చి తమనివేదికనుసంఘమువారికి సమర్పించుకొన్నారు-

... ...

## ౧ లక్షరూపాయల ఖాదినిధి

౪-౮-౧౧గనాడు శ్రీరామచంద్ర రావుఅంటు గారిఅధ్యక్షతను హైదరాబాదుఖాదిప్రచార సంఘకార్యకారిణీ సభజరిగెను. ఇందుఈక్రింది తీర్మానము అంగీకరింపబడెను-

జాతీయవారసందర్భమునఖాదిఫండునుగూర్చి చేసినఅపీలును సమర్థించుచు లక్షరూపాయలు నిండునంతవరకు ఈనిధిని తెరచియుంచవలసినదని తీర్మానించనైనది.

ఈఖాదినిధిని అఖిలభారతచరఖాసంఘ అధ్యక్షులగు గాంధిమహాత్మునకర్పించి ఆమొత్తమును హైదరాబాదులో చరఖాసంఘశాఖను స్థాపించుకొరకు ఉపయోగించవలసినదిగా కోరవలెనని తీర్మానించనైనది- మరియుఒక వెయ్యిరూపాయిలు సమకూడినవెంటనే గాంధిమహాత్మునకు పంపచేయుటకు కార్యదర్శికి అధికారమియ్యనైనది- ఇట్లుపంపబడుమొత్తమునుండి అంతవరకు ఖాదిఉత్పత్తి మరియువిక్రయమును అభివృద్ధిచేయుటకును కేంద్రములనుస్థాపించుటకును వ్యయపరచవలెనని అధ్యక్షునికోరుటకు తీర్మానించనైనది- కనుక హైదరాబాదురాష్ట్రవాసులు జాతి మతభేదములనుపాటించక ఉదారహృదయముతో ఖాదినిధికిచందాలిచ్చి సహకరించగలరని ప్రార్థన.

... ...

శనివారమునాడు హైద్రాబాదు నగరములో విమానదాడికూత [సైరన్] చేయబడెను- మధ్యాహ్నానంతరం ౩గంటలకాలములో పోలీసులజవానులు వీధులలోనిలబడి జనులనుప్రక్కలకుజోపిరి. బాటలకిరుప్రక్కలలో జనులునిలబడిరి-౧౫నిముషాలతర్వాత మరొకకూతచేయబడెను- దానితో అందరికిని తమబాటపట్టుకొనిపోవుటకు సెలవయ్యెను.

... ...

శ్రీసరోజిపాతశాలల పర్యవేక్షకురాలైయుండిన మిస్-నందీగారు (విద్యాశాఖ సదర్ మోహతమీం)కొన్నిదినాలు అనారోగ్యముతో బాధపడి ౧౧జూనునాడు చనిపోయిరి-

## దేశాయిగారి మరణం

### కమిషన్ విచారణనుకోరుట

దాసప్పదేశాయిఅను ౨౫ ఏండ్ల యువకుని హైద్రాబాదుప్రభుత్వమువారు రాజకీయనిర్బంధితఖైదీగా వరంగల్ జెయిలులో నిర్బంధించి యుండిరి-అతడుగతవారము చనిపోయెను-ఆసందర్భమును పురస్కరించికొని హైద్రాబాదునాయకులగు రామానందతీర్థ, వైద్య, కిర్మాణి, యం-నరసింగరావు, రామచంద్రపల్లంతూ, బి-రామకృష్ణారావు, గణేశిలాల్ వ్యాసు గోపాల్రావు, బిందూ షేడా నరేందర్ రామాచారిగారలు మరికొందరును ఈవిధముగాప్రకటించినారు.

"దాసప్పదేశాయిగారి అకాలమరణము మాకుచాలావిషాదము కలిగించినది. ఇక్కడవరకు అనారోగ్యమునుగురించి ఎవ్వరికిన్ని తెలియదు- జెయిలుసంబంధఅధికారులు అతని బంధువులకున్నూ తెలుపకపోయిరి. అతనిఅన్నదమ్ములుభార్య అచ్చటరాకముందే అతనిశరీరాన్ని దహించివేసినారు-దానివలన అనుమానాలు కలుగుచున్నవి- అతనిపైనేరమును రుజావుచేయుటకేను- అందుచేత అతన్ని అధికారులు ఎక్కువమర్యాదగా చూచియుండవలసియుండెను-గందేమాతరంఆందోళనములో అతని ధైర్యసాహసములు విద్యార్థులకుతనిమార్గదర్శకమని దేశభక్తిని చాటుచున్నది- దేశసేవకై అతడు ఆత్మబలిదానమునకుకూడా సిద్ధమైయుండెను-

ప్రభుత్వమువారు నిష్పాక్షికమైన కమిషను ఏర్పాటుచేసికరువిధిని జరిగినదానికిబాధ్యులైనఅధికారిఆతనిఆరోగ్యముఅంతగా చెడుచుండినచో అతనివిడుదలచేసియుండవలెను లేదాఅతనికోరికప్రకారం మంచివైద్యసహాయమైనాఇప్పించియుండవలెను- ఇట్టిసంఘటనలు జరుగకుండాప్రభుత్వమువారు ప్రజలతృప్తిపరచుటవారివిధియైయున్నది- ఎందుకంటే ఈకాలములోచాలామందిని విచారణలేకుండా ప్రభుత్వమువారు నిర్బంధించియున్నారు-

దేశాయిగారిని ప్రభుత్వమువారు విచారణలేకుండానిర్బంధించియుండిరి- దేశాయిగారిపెండ్లి అతన్ని ఖైదులోవేసినానికి వారం దినాలముందే జరిగియుండెను- అందుచేతఅతని వితంతువుయొక్క దురదృష్టముమరింత శోకకారణమైనది. వారికుటుంబమునకుమా సానుభూతిని తెలుపు. దేశాయిగారిత్యాగము వ్యర్థముగాపోకుండా ఉండునుగాక. వారిఆత్మశక్తిమాలో ప్రవేశించిమాకును త్యాగశక్తినిప్రసాదించుగాక."

